

# మూడు ప్రశ్నలు

లియో టాల్‌స్టాయ్

కథ ఆధారంగా

మాటలు, బొమ్మలు: **జాన్ జె. ముథ్**





అనగా అనగా నికొలాయ్ అనే పిల్లవాడు ఉండేవాడు. అప్పుడప్పుడు ఏది సరైన పని అన్న అనుమానం అతనికి కలిగేది. “మంచి వ్యక్తిని కావాలని నాకు ఉంది,” అతను తన స్నేహితులతో అన్నాడు. “కానీ అందుకు సరైన దారి ఏదో నాకు అన్నిసార్లు తెలియటం లేదు.”

అతని స్నేహితులు అది అర్థం చేసుకున్నారు. అతనికి సహాయం చెయ్యాలని వాళ్లకి ఉంది.

“నా మూడు ప్రశ్నలకు సమాధానాలు దొరికితే ఏం చెయ్యాలో నాకు అర్థమవుతుంది,” అతను అన్నాడు.

పనులు చెయ్యటానికి సరైన సమయం ఏది?

అందరికంటే ముఖ్యమైన వ్యక్తి ఎవరు?

చెయ్యవలసిన సరైన పని ఏది?

నికొలాయ్ స్నేహితులు మొదటి ప్రశ్న గురించి ఆలోచించాయి.

ముందుగా తెల్ల కొంగ, "పని చెయ్యటానికి సరైన సమయం తెలియటానికి మొదటగా ప్రణాళిక తయారు చేసుకోవాలి," అని చెప్పింది.



ఆకులలో తినటానికి ఏమైనా దొరుకుతుందేమోనని వెదుకుతున్న కోతి గోగోల్, "శ్రద్ధ పెట్టి గమనిస్తూ ఉంటే పని చెయ్యటానికి సరైన సమయం ఏదో తెలుస్తుంది," అంది.





కునుకు తీస్తూ ఉన్న కుక్క పుష్కిన్ పక్కకి ఒత్తిగిల్లి, "అన్నిటిపైనా ఒక్కరే దృష్టి పెట్టటం కష్టం. అందుకు ఒక బృందం ఉండాలి. ఉదాహరణకి, గోగోల్! నీ నెత్తి మీద కొబ్బరికాయ పడబోతోంది," అంది.



నికొలాయ్ ఒక క్షణం పాటు ఆలోచించాడు.
తరవాత తన రెండవ ప్రశ్న అడిగాడు.
“అందరికంటే ముఖ్యమైన వ్యక్తి ఎవరు?”



“స్వర్గానికి దగ్గరగా
ఉన్నవాళ్లు,” ఆకాశంలోకి
ఎగురుతూ అంది సోన్యా.

“జబ్బుపడిన వాళ్లని నయం
చెయ్యగలిగిన వాళ్లు,”
గాయమైన తలను
తడుముకుంటూ చెప్పింది
గోగోల్.





“నియమాలు చేసేవాళ్లు,”
గుర్రుమంది పుష్కిన్.

నికోలాయ్ మరి కొంతసేపు ఆలోచించాడు. తరవాత తన మూడవ ప్రశ్న అడిగాడు, “చెయ్యవలసిన సరైన పని ఏది?”

“ఎగరటం,” అంది సోన్యా.

“ఎప్పుడూ సరదాగా ఉండటం,” నవ్వింది గోగోల్.

“పోట్లాడటం,” అంటూ పుష్కిన్ మొరిగింది.

నికొలాయ్ చాలాసేపు ఆలోచించాడు. తన స్నేహితులంటే అతనికి ప్రేమ. తన ప్రశ్నలకు సమాధానం ఇవ్వటానికి అవి సహాయం చేశాయి. అయితే ఆ సమాధానాలు అతనికి సంతృప్తిని ఇవ్వలేదు.

అప్పుడు అతనికి ఒక ఆలోచన వచ్చింది. ‘నాకు తెలిసింది!’ అతను అనుకున్నాడు. ‘తాబేలు లియోని అడుగుతాను. అది చాలా ముసలిది. నా ప్రశ్నలకు సమాధానం దానికి తప్పకుండా తెలుస్తుంది.’



ముసలి తాబేలు ఒంటరిగా ఉంటున్న కొండపైకి నికొలాయ్ నడుచుకుంటూ వెళ్లాడు.



నికొలాయ్ అక్కడికి చేరుకునే సరికి ముసలి తాబేలు తోటలో తవ్వుతూ కనిపించింది. వయస్సు వల్ల అది మెల్లగా తవ్వుతోంది.

“నా మూడు ప్రశ్నలకు సమాధానం తెలుసుకుందామని నీ దగ్గరకు వచ్చాను,” నికొలాయ్ చెప్పాడు. “పనులు చెయ్యటానికి సరైన సమయం ఏది? అందరికంటే ముఖ్యమైన వ్యక్తి ఎవరు? చెయ్యవలసిన సరైన పని ఏది?”



ఆ ప్రశ్నలను లియో శ్రద్ధగా వింది. అయితే అది నవ్వి ఊరుకుంది.
అది తవ్వుతూనే ఉంది.
చివరికి నికొలాయ్, "మీరు అలసిపోయి ఉంటారు, నేను సహాయం చేస్తాను," అన్నాడు.
తాబేలు తన పారని అతనికి ఇచ్చి ధన్యవాదాలు తెలిపింది.
ముసలి తాబేలు కంటే వయస్సులో ఉన్నవానికి తవ్వటం తేలిక కాబట్టి పని అంతా నికొలాయ్ పూర్తి చేశాడు.



నికొలాయ్ పని పూర్తి చేశాడో లేదో గాలి బలంగా వీస్తూ, నల్లటి మబ్బుల నుంచి జోరుగా వాన పడసాగింది.

వాళ్లు గుడిసె వైపు వెళుతుండగా ఎవరో సాయం కోసం అరవటం నికొలాయ్‌కి వినిపించింది.



పరిగెత్తుకుంటూ అటు వెళ్లిన నికొలాయ్‌కి చెట్టు మీద పడటంతో కాలికి గాయం అయిన పాండా కనిపించింది.



దానిని తన చేతులలో జాగ్రత్తగా లియో ఇంట్లోకి తీసుకుని వెళ్లాడు నికొలాయ్.
వెదురు బద్దతో గాయమైన కాలికి కట్టు కట్టాడు.



తలుపుల మీద, కిటికీల మీద వాన దబదబమంటూ చప్పుడు చేస్తూనే ఉంది.

పాండాకి మెలకువ వచ్చింది.

“నేను ఎక్కడ ఉన్నాను?” అది అడిగింది. “నా పాప ఏది?”



అబ్బాయి గుడిసె లోంచి బయటకు పరిగెత్తాడు. గాలి హోరుమంటోంది. వానలో తడుస్తూ అతను అడవిలోకి పరిగెత్తాడు. అక్కడ నేల మీద వానకు తడిసి, చలితో వణుకుతున్న పాండా కూతురు అతనికి కనిపించింది.



చిన్నారి పాండా ప్రాణాలతోనే ఉంది కానీ బాగా భయపడిపోయింది.
నికొలాయ్ దానిని గుడిసె లోకి తీసుకుని వెళ్లి శుభ్రంగా తుడిచాడు.
దానిని వెచ్చబరిచాడు. తరవాత తల్లికి అప్పగించాడు.



అబ్బాయి చేసింది చూసి లియో నవ్వింది.



మరునాడు సూర్యుడు వెచ్చగా ప్రకాశిస్తున్నాడు. పక్షులు తమ కిలకిలారావాలతో సందడి చేస్తున్నాయి. లోకం అందంగా ఉంది. పాండా కాలి నొప్పి కొంచెం తగ్గింది. తనని, తన కూతురిని వాన నుంచి రక్షించినందుకు నికొలాయ్‌కి అది ధన్యవాదాలు తెలిపింది.

అంతా బాగానే ఉందని నిర్ధారించుకోటానికి సోన్యా, గోగోల్, పుష్కిన్ అక్కడికి వచ్చాయి.

నికొలాయ్‌కి లోలోపల ఎంతో ప్రశాంతంగా అనిపిస్తోంది. అతనికి చక్కని నేస్తాలు ఉన్నారు. పాండాని, దాని కూతురిని అతను కాపాడాడు. అయితే అతనికి కొంత నిరుత్సాహం కూడా కలిగింది. అతని ప్రశ్నలకి ఇంకా సమాధానం దొరకలేదు. అందుకే లియోని మరొకసారి అడిగాడు.





అబ్బాయి వైపు ముసలి లియో చూసింది.

"కానీ నీ ప్రశ్నలకు సమాధానం అందిందిగా!" అంది.

"ఎలా?" అడిగాడు అబ్బాయి.

“నిన్న తోట పనిలో సాయం చెయ్యటానికి ఉండిపోకపోతే వానలో సాయం కోసం పాండా అరుపులు నువ్వు వినగలిగి ఉండేవాడివి కాదు. కాబట్టి తోటలో నువ్వు తవ్వుతూ గడిపిన సమయం ముఖ్యమైనది. ఆ క్షణంలో ముఖ్యమైన వ్యక్తిని నేనే. అప్పుడు తోటలో నాకు సాయం చెయ్యటమే ముఖ్యమైన పని.

“తరవాత గాయపడిన పాండా కనిపించినప్పుడు దాని కాలికి చికిత్స చేస్తూ, ఆమె కూతురిని కాపాడుతూ గడిపిన సమయం ముఖ్యమైనది. అప్పుడు పాండా, ఆమె కూతురు ముఖ్యమైన వ్యక్తులు. వాళ్లకి సహాయం చెయ్యటమే ముఖ్యమైన పని.







“ఒకే ఒక్క ముఖ్యమైన సమయం ఉంది. అది ప్రస్తుతం. అప్పుడు నువ్వు ఎవరితో ఉన్నావో వాళ్లే ముఖ్యమైన వ్యక్తులు. నీతో ఉన్నవాళ్లకి మంచి చేసేదే ముఖ్యమైన పని. ప్రపంచంలో ముఖ్యమైనది ఏమిటి అన్న ప్రశ్నలకు ఇవే సమాధానాలు, అబ్బాయీ.



“అందుకే మనం ఇక్కడ ఉన్నాం.”





అయిపోయింది.